# జీవితానికి అర్థం ఏమిటి?





మూలం

**ఆచార్య నరేంద్రదేవ్**

**డా॥ రామ్ మనోహర్ లోహియా**

స్వేచ్ఛానువాదం

**గౌరవ్**



ప్రచురణ

**మానవతా వేదిక**

తెలుగు రాష్ట్రాలు

# జీవితానికి అర్థం ఏమిటి?

# సోషలిస్టులకి ఏం కావాలి?

ఆచార్య నరేంద్రదేవ్
డా॥ రామ్ మనోహర్ లోహియా

స్వేచ్ఛానువాదం
గౌరవ్

ప్రచురణ
మానవతా వేదిక

ముద్రణ
సెప్టెంబరు, 2017

**ఉచిత పంపిణీ కొరకు**

ప్రతులకు
9032094492

వివరాలకు
gouravmeka@gmail.com

# సమానత్వం సర్వోన్నత మానవ విలువ

మనిషి స్వతహాగా స్వతంత్రుడు. అతడ్ని ఏదోక మూకతోబాటే కట్టిపడుంచే ప్రయత్నాలన్నిటినీ అనాదిగా అతడు వ్యతిరేకిస్తూనే వచ్చాడు. అందుకోసం ఎన్నెన్నో శాస్త్రాల్ని సృష్టించాడు, మరెన్నో మస్తిష్కాల్ని మధించాడు. ఆటవిక దశలో తిరుగాడిన నాటి నుండి ఆధునికుడిగా అభివృద్ధివైపు నడుస్తున్న నేటి వరకూ నిత్యం మార్పు చెందుతూనే వచ్చాడు. ప్రాకృతికంగా నున్న అడ్డంకులు మొదలుకుని, ప్రతీ కాలంలోనూ ఎదురైన ప్రతిబంధనాలన్నింటినీ దాటుకుంటూ ముందుకు పోతున్నాడు. ఆ క్రమంలో సహకారవంతమైన సమాజ నిర్మాణానికి కొన్ని నింబధనల్ని స్వచ్ఛందంగా ఏర్పర్చుకున్నాడు, వాటినే విలువలన్నాడు.

మనిషి మరో మనిషితో హుందా అయిన పంథాలో నడిచేందుకు విలువలనేవి అవసరం. అలాగే సమాజం నిరంతర స్రవంతిలో ఉందనడానికి ఆ సమాజంలోని వ్యక్తుల విలువలే గీటురాయి. విలువలు మారతాయి, కొత్త విలువలు చేరతాయి. ఐతే, ఎప్పటికప్పుడు ఏర్పర్చుకున్న విలువల వెలుగులో మానవాళి మరింత పురోగమించడమనేది జరుగుతుంటుంది. అందుకోసం ముందుకొచ్చే చైతన్య కదలికలే ప్రజా ఉద్యమాలు. సమాజంలో అందరికీ సమాన అవకాశాలుండాలనీ, ప్రతీ వ్యక్తీ సామాజిక చింతనతో కూడిన ఆచరణలో భాగం కావాలని ఆశించడం, అందుకోసం ప్రయత్నించడం ఒక నాగరిక విలువ.

ఒక సమాజంలో ఏదేని ఒక విలువ ప్రాధాన్యతను అందులోని వ్యక్తులు గుర్తించి పాటించే దిశగా మళ్ళించి మార్పుకోసం ప్రయత్నించడమే భావోద్యమాల బాధ్యత. ఈ దేశంలో అవి ఆ ఒక్కటీ మినహా తతిమ్మా అన్ని పనులూ చేశాయి. స్వతహాగా కొద్దోగొప్పో సామాజిక స్పృహ కలవారు కూడా ఆధిపత్య భావజాలాన్ని మానసికంగా నింపుకున్న వారవడం చేత ఉద్యమరంగాలన్నింటిలోనూ ఊడిగం చేసే మనస్తత్వమే రాజ్యమేలుతోంది. వ్యక్తి జీవితంలోని ప్రతి పార్శ్వంలోనూ లోతుగా పాతుకుపోయిన ఈ బానిస పద్ధతుల్ని మార్చకుండా ఈ దేశంలో ఏ ఉద్యమమూ సాధ్యపడదు.

ఆ విషయాన్ని సమగ్రంగా అర్థం చేసుకున్న వ్యక్తులంతా వారి శక్తికొద్దీ ప్రయత్నం చేస్తూనే వచ్చారు. గెలుపోటముల ప్రసక్తి లేకుండా భావితరాలవారి కోసం చాతనైన మార్గం వేసుకుంటూ పోయారు. ఈ క్రమంలో విలువల్ని లక్ష్యాలుగా చేసుకున్నవారు వాట్ని సాధించేందుకు వారికి తోచిన మార్గాలు కొన్నింటిని ప్రతిపాదించారు. వాట్నే సిద్ధాంతాలన్నారు. సైద్ధాంతిక దార్శనికత లోపించిన

మరికొందరు మా సిద్ధాంతాలే సర్వమన్నారు. అంత గర్వం పనికిరాదని బుద్ధి చెప్పాలని చూసే కొందరు ఏ తరంలోనైనా లేకపోలేదు. కాని తర్వాత తరాలకి వారి స్ఫూర్తిని అందించినవారు తక్కువ.

అలాంటి వారిలో కొద్దిమంది కృషిని ఈ మాసంలో స్మరించుకోవడం నా వరకూ నాకు ఒక చారిత్రక అవసరంగా అనిపిస్తుంది. అందులో భాగంగానే గాంధీ మొదలుకుని ఆచార్య నరేంద్రదేవ్, డా॥ జయప్రకాష్ నారాయణన్, డా॥ రామ్ మనోహర్ లోహియా, కమలాదేవీ చటోపాధ్యాయ లాంటి వారందర్నీ తల్చుకోడానికి అక్టోబర్ నెల వివిధ కార్యక్రమాలు నిర్వహించుకోడానికి ఒహ సదవకాశంగా భావించొచ్చు. రోజురోజుకీ విలువల పతనాన్నే వినూత్నమైన నాగరికతగా భావిస్తున్న నూతన తరాలకి విశిష్టమయిన ఈ వ్యక్తుల్ని పరిచయం చేయడం కూడా భావోద్యమాల్లో భాగమే.

అలా విలువల కోసం జీవితాంతం నిలబడ్డ వారి గురించి ఈ తరాలకి తెలియజేసే విస్తృత కార్యక్రమంలో భాగంగా ప్రస్తుతం ఈ దేశంలోని ప్రగతిశీల ఉద్యమాల్ని దగ్గరుండి ప్రోత్సహించిన యిద్దరు మహావ్యక్తుల వ్యాసాల్ని ఇలా తెలుగుచేసి మీ ముందుకు తీసుకురావడం జరుగుతోంది. వారిలో ఒకరు ఆచార్య నరేంద్రదేవ్, మరొకరు, డా॥ రామ్‌మనోహర్ లోహియా. ఈ దేశపు ప్రత్యేక పరిస్థితుల్ని అర్థం చేసుకుని ఎలాంటి సాధనాల ద్వారా ఇక్కడ మార్పు సాధ్యమవుతుందో సమగ్రమయిన విశ్లేషణ ద్వారా చెప్పడమే కాక నిబద్ధతతో ఆచరించినవారే ఇరువురూ. మరో ఆసక్తికర విషయమేమిటంటే ప్రసిద్ధ రచయిత జాక్ లండన్ కూడా నరేంద్రదేవ్‌గారు రాసిన శీర్షికతో "వాట్ లైఫ్ మీన్స్ టు మీ" పేరుతో ఆత్మకథాత్మక వ్యాసమొహటి నవంబర్, 1905లో రాసాడు.

ఆచార్య నరేంద్రదేవ్, ప్రొఫెసర్ రాజా రామ్‌శాస్త్రి ప్రకారం భారతీయ సోషలిస్టు పితామహుడు, గొప్ప మేధావి, ఆలోచనాపరుడు. సామాజిక శాస్త్రవేత్తగా విస్తృతమయిన అధ్యయనం చేసాడు. డా॥ జగన్నాథ ఉపాధ్యాగారి ప్రకారం బౌద్ధ ధర్మాన్ని నరేంద్రదేవ్ చేసినట్లుగా అధ్యయనం చేసినవారు అత్యంత అరుదు. బౌద్ధంలో స్థవిరవాదం, మహాయానం, హీనయానం, త్రిపీతకాలు, అనుపీతకాలు, అభిధమ్మ పీతకం మొదలగు అంశాల్ని మధించడానిగ్గాను దశాబ్దాలపాటు నిరంతరం కృషి చేసారు. ఇందుకోసం ఆయన ఆంగ్లభాష మొదలుకుని సంస్కృతం, పాళీ, సింహళీ, బర్మీస్, ఫ్రెంచ్ భాషల్లో సైతం కుస్తీపట్టాల్సి వచ్చింది..

ఇక డా॥ రామ్‌మనోహర్ లోహియా అసాధారణ మేధావి, మేథోజగత్తులో అగ్రగణ్యులుగా నిలవడానికి అర్హతున్న అతికొద్దిమందిలో లోహియా ఒకడు. మనిషి



జీవితానికి, సమాజానికి గల సంబంధాలన్నింటినీ సమగ్రంగా చర్చించి మార్పు తీసుకురావడానికి అవసరమయిన బహుముఖ కార్యాచరణను లోతుగా అర్థం చేసుకుని, అందుకోసం జీవితాంతం పాటుపడిన విలక్షణ జీవి. ఎమ్మెన్ రాయ్, డా॥ బి.ఆర్. అంబేద్కర్, మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్, డా॥ రామ్‌మనోహర్ లోహియా ఈ దేశానికి మేథో వారసత్వాన్నిచ్చిన మహానుభావులు. ఇండియాకి నాలుగు స్తంభాలవంటివారు.

వెయ్యి సంవత్సరాలపాటు ఈ దేశంలో అత్యున్నతంగా విలసిల్లిన బౌద్ధం ఎందుకెలా ఎప్పుడు పతన దశకు చేరిందో శాస్త్రీయంగా పరిశోధించినవారికి మాత్రమే మేధోపరంగా రాయ్, అంబేద్కర్, సాంకృత్యాయన్‌ల కృషి అర్థమౌతుంది. అయితే, అధ్యయనం ఆచరణతోబాటు వ్యక్తిగత జీవితాన్ని పూర్తిగా త్యాగం చేసిన అరుదయిన వ్యక్తి లోహియా. విభిన్నంగా ఉండటం అనుకున్నంత సులభం కాదు. అందులోనూ వివిధ రకాలైన సంకుచిత ధోరణులు పొంచి ఉన్న భారతీయ వ్యవస్థలో ఏ వాదంలోనూ ఇమడకుండా అస్తిత్వాన్ని నిలుపుకోవడమెంత కష్టమో ఏదోకవైపు ఉంటూనే దార్శనిక దృష్టి పాటించడం అంతకు మించి క్లిష్టం.

అందుకే మనకి వాదవివాదాల పైనున్న ఆసక్తి, బాధ విచారాలపై ఉండదు. సిద్ధాంత రాద్ధాంతాల కొరకు సిద్ధపడే ఉత్సాహం నిబద్ధ ఆచరణకు ఉండదు. కొద్దోగొప్పో ఆచరించేందుకు ముందుకొచ్చే వార్ని కూడా కోట్లకొద్దీ ఆస్తుల కూడగట్టుకున్న అభ్యుదయవాదులు పట్టించుకోకపోవడంతో, ఎంతో కొంత నిజాయితీ గల వ్యక్తిత్వాలు కూడా పట్టెడన్నం కోసం ఉద్యమాల్నుంచి పక్కకు తప్పుకోవాల్సిన పరిస్థితి దాపురించింది. ఉపన్యాస వేదికలకి, కార్యకర్త బోధనలకి, డాంబిక రాతలకి మాత్రమే పరిమితమయ్యే వ్యక్తిత్వాలు వ్యవస్థ మాటటుంచి కనీసం వ్యక్తిగతంగా కూడా నిబద్ధతను నిలుపుకోలేరన్నదో నిజం.

ఇలాంటి పరిస్థితుల్లో మనిషి జీవితానికి అర్థం చెప్పిన ఆచార్య నరేంద్రదేవ్ వ్యాసాన్ని, సోషలిస్టులకి అన్నప్పటికీ స్వేచ్ఛాలోచనాపరులంతా ఏం చేయాలన్న దానిపై విలువైన అభిప్రాయాలు వెలిబుచ్చిన డా॥ రామ్ మనోహర్ లోహియా వ్యాసాన్ని ఇలా చిన్న పొత్తంగా మీ ముందుకు తీసుకురావడం జరుగుతోంది. మనిషికి సంకుచిత సంకెళ్ళు వేసి భావస్వేచ్ఛను బందీ చేస్తున్న ప్రస్తుత వాతావరణంలో సమాజవాదులుగా పేరొందిన ఈ ఇరువురు ఆలోచనాపరుల వ్యాసాలిలా రావడం ఏదోమేరకు ఆరోగ్యకరమనేదే నా భావన.

– గౌరవ్

# జీవితానికి అర్థం ఏంటి?

ప్రతీ ఒక్కరూ జీవితానికి అర్థం – పరమార్థం తెల్సుకోవాలి. అనేక రకాలైన రంగుల సంగమం జీవితం. అదెంత మృదువుగా ఉంటుందో అప్పుడప్పుడు అంత జటిలంగానూ మారుతుంది; ఆనందాన్నెలా ఇస్తుందో బాధను కూడా అలాగే అందిస్తుంది. జయాపజయాల్ని కూడా రంగరిస్తుంది. జీవన సారమంతా విలక్షణతతోనే నిక్షిప్తమై ఉంది, కాన జీవితం బహుముఖపాశ్వం. ఒక రకంగా ప్రతి వ్యక్తికీ చేరాల్సిన గమ్యముంటుంది. దాన్ని చేరుకోవడం కోసం తనకి తృప్తినిచ్చే మార్గం కోసం ప్రతీవ్యక్తీ అన్వేషించవచ్చు. అతడు ప్రేమించే పనిలోనే జీవితాన్ని సుస్థిరం చేసుకోవచ్చు. అలా ఎన్నుకున్న పని మాత్రమే జీవితంలో సహజమయిన సంతోషాన్నివ్వగలదు. భిన్నత్వాన్ని అడుగడుగునా జీర్ణించుకున్న జీవితంలో, వ్యక్తి తనకు ఆత్మసంతృప్తినిచ్చే అనుభవాలకై తహతహలాడుతుంటాడు. సాంప్రదాయంగా వచ్చిన విలువలన్నింటినీ, విమర్శించకుండా అతడు స్వీకరించలేడు. జీవితం నిత్యనూతనత్వంతో చలించే వో ప్రవాహం. ఆదర్శాలు, వాటి అమలుకై ఆవిర్భవించిన సంఘాలు కాలక్రమంలో వివిధ మార్పులకు లోనౌతాయి. ఎప్పటికప్పుడు పునర్నిర్వచించబడిన విలువలే మానవాళి దార్శనికతకి పునాదిరాళ్లు. మన సమాజంలో ఒకవైపు మార్పు చెందుతూ ముందుకెళుతుంటే మరోవైపు కొత్త సమస్యలు తయారౌతున్నాయి, వాటి పరిష్కారాల కోసం ఎదురుచూస్తున్నాయి. కొద్దిపాటి చింతతో ఏ విధమయిన బాధలూ, కష్టాలు లేని జీవశాస్త్రం మనకి కావాలనుకుంటే, మన కాలంలో నిల్చున్న సమస్యల సవాళ్ళను పనిచేయడం కోసం సాంఘిక విలువల్ని జీర్ణించుకున్న కొత్త క్రమాన్ని అనుసరించాలి. అంటే ప్రతి ఒక్కరూ జీవితాన్ని పునరన్వేషించుకోవాలి. ఇతరులు సలహాలివ్వడానికి – సహాయం చేయడానికి అక్కరకు రావచ్చు గానీ అన్వేషణ మాత్రం ఎవరికి వారే చేయాలి.

జీవితానికి అర్థం ఏమిటి? అనే ప్రశ్న వినిపిస్తుంటుంది. సత్యం, సౌందర్యం, సాంఘిక శ్రేయం మానవుడి లక్ష్యంగా గుర్తించబడ్డాయి. ఈ లక్ష్యసాధన దిశగానే మానవ ప్రయత్నాలన్నీ సాగాలి. సాంఘిక ఆపదల్నుంచీ గట్టెక్కి మానవాళి సుసంపన్నం కావాలంటే, అర్థవంతమైన లక్ష్యాల వైపు సాగే మన ప్రస్థానం



అంకితభావంతో కూడుకున్నదై ఉండాలి. ఐతే, ఈ మానవ లక్ష్యాల అర్థం మారుతూ ఉంటుంది. మారుతున్న సమాజానికి అనుగుణంగా మానవాళి లక్ష్యాలు కూడా పునః మూల్యాంకనం కావించబడుతూ పునర్నిర్వచనాలకు గురౌతూండాలి. వ్యక్తి సాంఘిక వాతావరణానికి పుట్టినవాడు. సమాజ ప్రభావం వ్యక్తిమీదుంటుంది. కాన ప్రతివ్యక్తి తన ప్రవృత్తి ననుసరించి జీవితార్థాన్ని అన్వేషించాలి. ఏ వ్యక్తయినా సమాజ పరిమితులకు లోబడి, చుట్టూ ఉన్న మానవ విలువల ఆధారంగానే ఆ పని చేయగలడు.

ఈ శాస్త్ర సాంకేతిక యుగంలో సమిష్టిభావనతో సంఘంగా మారే క్రమం మరింత విశిష్టతను సంతరించుకుంది. అంతమంది ప్రజాశ్రేణుల్ని సరైన విధంగా నియంత్రించకపోతే పర్యవసానాలు అనుభవించాల్సి ఉంటుంది. అందుబాటులోనున్న వనరులతో విజ్ఞానశాస్త్రాన్ని సరిగా వినియోగించగలిగితే వ్యవస్థని పట్టి పీడిస్తున్న వివిధ రోగాల్ని – పేదరికాన్నీ తుదముట్టించి విస్తారమయిన అభివృద్ధి సాధించొచ్చు. గడిచిన శతాబ్దపు వ్యక్తివాదాన్ని విడనాడి పరస్పర సహకారంతో కూడిన సామాజిక సహృద్భావ వాతావరణంలో సమిష్టిగా ప్రయత్నించడం వల్లనే విజ్ఞానశాస్త్ర ఫలాల్ని విశాలంగా విస్తరింపజేసేందుకు వీలుంటుంది.

ఈ యుగంలో వ్యవస్థ మరింత మానవీయం చెంది ప్రజలంతా వారివారి ఆశల్ని – ఆకాంక్షల్ని నెరవేర్చుకుని జీవించాలనంటే, మనం మన ఒంటెద్దు పోకడల్ని, వ్యక్తిగత స్వార్థాన్ని అధిగమించగలగాలి. విస్తారమయిన వనరుల్ని మానవాళి సుఖసంతోషాల కోసం ఇవ్వడానికి సిద్ధపడ్డ ప్రకాశవంతమయిన వ్యవస్థ భవిష్యకాలంలో వేచి చూస్తోంది. సంక్షేమ సమాజం కావాలంటే దుష్టమయిన సొంత ఎదుగుదలని, భ్రష్టత్వంతో కూడిన స్వార్థాన్ని విడనాడే మనస్తత్వం పెంపొందాలి. అత్యాశతోనూ, అందరినీ కిందకునెట్టి పైకెదిగిపోవాలనే తలంపుతోను వుండే సమాజం ఎప్పటికీ మంది మంచిని గురించి ఆలోచించలేదు. అవసరాల్ని సక్రమంగా గుర్తించడం ద్వారానే మనం మన జీవితాల్ని అభివృద్ధి దిశగా తీసుకెళ్ళగలం; నాగరిక సమాజాన్ని అర్థం చేసుకున్న వారు మాత్రమే అవసరాల్ని గుర్తించి న్యాయబద్ధంగా నడుచుకోగలరు. అలాగే అలాంటివారే ఇతరులకి సహాయపడగలరు. అంటే, దీనర్థం వ్యక్తికి ఏమాత్రం విలువా లేదని కాదు. మనిషి యంత్రం చేతిలోనో, యంత్రాంగం

చేతిలోనో బానిసకాదు. తన మంచికి, వ్యవస్థ అభ్యున్నతికి వాట్ని ఎలా వాడాలనే చైతన్యం కలవాడు. చుట్టూ నెలకొనున్న పరిసరాల్ని పసిగట్టి వికాసం చెందగల వాతావరణంలో ఇమడగలవాడు. అలాగే వ్యవస్థలోని సమస్యల్ని గుర్తించి అధిగమించగలవాడు. ఇదంతా బయటి ప్రభావం ఏం లేకుండా అతడు స్వతంత్రంగానే చేయగలడు. యంత్రం, యంత్రాంగం అధికారపు మదంతో తులతూగే వారి చేతుల్లో కాక మానవత్వం, సేవాదృక్పథం కలవారి చేతుల్లో ఉండాలి. ఏ స్వార్థమూ లేకుండా స్వచ్ఛందంగా ఇతరుల కోసం త్యాగం చేయడం అత్యున్నత ధర్మం. అది మనందరి ఆదరాభిమానాల్ని చూరగొంటుంది. ఐతే, నియంత అహంకారతత్వానికి ఆకర్షితులై పిచ్చెక్కిన భావాలతో తన వాదాన్ని నిరూపించేందుకు జాతి మొత్తాన్నీ రూపుమాపే ప్రయత్నంలో పాలుపంచుకునే వ్యక్తులకిది వర్తించదు. వ్యక్తి ఎప్పుడూ కీలుబొమ్మలా చూడబడరాదు. పైగా అతడి వ్యక్తిత్వాన్ని గొప్పగా గౌరవిస్తూ, వృద్ధికి తోడ్పడే అవకాశాలన్నింటినీ అతని దరిచేర్చాలి. అయితే ఈ బృహత్తర కార్యం సమిష్టి తత్వంతోనే సాధ్యమనే వైఖరి వ్యక్తికి ఉండాలి. మానవీయత మీద మాత్రమే నిర్మితమయిన నైతిక భావాలు, ప్రవర్తనా పద్ధతుల ద్వారా నవమానవతావాద సంస్కృతి సంభవిస్తుందనే అతి కీలకమైన విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. అటువంటి సామూహిక నైతికత్వమే మానవ ప్రగతికి తోడ్పడుతుంది. వ్యవస్థ గమనం లోనే వ్యక్తి గతి ఇమిడున్న సంగతి అవగతమైతే, తన స్థానాన్ని ఆనందంగా పదిలం చేసుకోగల వ్యక్తి కోట్లమంది ప్రజల సౌఖ్యం కోసం చైతన్యశీలుడైన సృష్టికర్తగా మారి మార్పుని ఆహ్వానిస్తాడు. తరతరాలుగా అధమంగా మృగస్థితిలో బతుకీడుస్తున్నవారు తమకంటూ స్థానం ఏర్పర్చుకునే స్థాయికొచ్చి ఒక నూతన స్వేచ్ఛను సాధించగలుగుతారు. వ్యక్తి నించి తీసుకున్నది తిరిగి అతడికిచ్చేయడం జరుగుతుంది; అతడి పరాయీకరణ ఇక ముగింపుకొస్తుంది.

కాని ఇదంతా సాధ్యపడాలంటే ఔన్నత్యాన్ని అన్వేషించే వ్యక్తులు ఉనికిలోకి రావాలి. కొత్త యుగానికి, నవీన నాగరికతకి వారే దూతలు. సమస్యల్ని, పరిసరాల్ని కొత్తకోణంలో అర్థం చేసుకోగల సామర్థ్యం వారికుండాలి. క్లిష్ట పరిస్తితుల్ని దాటిపోగల చైతన్యం కలవారై ఉండాలి. మానసిక సంక్షోభం మరింత ప్రమాదమైంది. మౌళికంగా ఇది మొత్తం మానవాళి సమస్య. నూతన సమాజం ఆవిర్భవించడానికి అవసరమయిన భౌతిక పరిస్థితులు ఏవైతే ఉన్నవో అవి శాంతి, సమానత్వం, సామాజిక న్యాయమనే



లక్షణాలపై ఆధారపడి రూపొందాలి. ఉన్న వనరులతో, సమిష్టి శ్రేయస్సు కోసం ఆ సమాజాన్ని నడిపించడమెలాగనే విషయం మాత్రం మనిషి నేర్చుకోవాల్సుంటుంది.

నవీన సామాజిక వ్యవస్థ మనిషిని సరుకుగా మార్చి బానిసను చేసింది, నిర్వీర్యపర్చి నిద్రావస్థలోకి నెట్టింది. ఈరోజు వ్యక్తి యంత్రంలో ఒక భాగంగా మారిపోయాడు. ఒక కార్మికుడు ఉత్పత్తి సాధనాలకి యజమాని కాలేడు. అతడు చేస్తున్న పనిలో ఆనందాన్ని ఆస్వాదించలేడు. అతడి జీవితం ఎంత నీరసంగా సాగుతుందంటే జీవితంలో ఇక తనకంటూ నిర్వహించడానికి ఏ పాత్రా లేదని, తాను అత్యంత అనవసర వ్యర్థ అస్తిత్వానికి చిహ్నమని కార్మికుడు భావిస్తాడు. ఈ స్థితి చివరికి నిరాశనిస్పృహలకు కారణమై సామాజిక సమస్యలకి దారితీస్తుంది. అనారోగ్యమయిన ఈ వాతావరణమే, ఆధునిక సమస్యల్ని పరిష్కరించడమెలానో పరిశోధించి పరిష్కారం కనుగొనే బదులు, మనల్ని మరింత గందరగోళపెట్టి నిరాశలోకి నెట్టే మతాల్ని, తత్వాల్ని ఆశ్రయిస్తుంది. ఇవేవీ కూడా సంక్షోభాన్ని దాటే ఉత్సాహాన్ని - స్ఫూర్తిని అందించలేవు. ఈ దైనందిన యుద్ధంలో ప్రతీక్షణం మానసికంగా క్షతగాత్రులైన ప్రజలు అసహాయ స్థితిలో పాత - కొత్త మతాల ఒరవడిలో ఒక్కక్కరే కొట్టుకొనిపోతారు. ఎందరో సున్నితులైన మానవత్వ ప్రేమికులు, నూతన సాంఘిక నిర్మాణానికి నాంది పలికే ఉద్యమాల్ని రూపొందించగల ధీరులు బేలగా జీవితం నుండి తప్పించుకుపోయి మతాల మార్మికతలో నిరాశగా సేదతీరుతున్నారు. మనిషిని ఎందుకూ కొరగాని వాడిగా మల్చే ఈ మతాలన్నింటినీ మన మనసుల్లోంచి తుడిచిపారేద్దాం. జీవితం అందమయిన కలని చెబుతూ అసలు జీవితం మరెక్కడో ఉందని నమ్మించే నిరాశతో నిండిన కట్టుకథలకు భారతదేశంలో కొదవలేదు. సర్వం శూన్యమనే సిద్ధాంతాలిక్కడ చాలానే ఉన్నాయి. జీవితాన్ని అనుభవించడం కష్టాల్నీ దుఃఖాల్నీ ఈదడమేనని నిరంతరం అవి బోధిస్తుంటాయి. అలాంటి తత్వాల వల్ల మనకి ఇసుమంత కూడా ప్రయోజనం లేదు. ప్రకృతితో పోరాడి దాన్ని నియంత్రించగల మనిషి అసాధ్యమనేదాన్ని అంగీకరించడానికి సిద్ధపడడు. పైగా తన ముందున్న ఎంతటి పెద్ద సమస్యనయినా చూసి భయంతో వెనకడుగువేయకుండా లక్ష్యాల్ని చేరుకోచూస్తాడు. నిరాశా, నిస్పృహలు మనిషి మహాయానంలో తాత్కాలిక అవాంతరాలేర్పర్చగలవే కాని, తన సామర్థ్యంతో ఒక

అందమయిన సుందర సమాజాన్ని నిర్మిస్తున్న మానవుడి మహాసంకల్పం ముందవి ఎప్పటికైనా మోకరిల్లి ఓటమినంగీకరించక తప్పదు. నేటి సమస్యలకి పనికిరాని గతంలో ఈనాటి మానవుడు తలదాచుకోలేడు. వెలసిపోతున్న పూర్వ వైభవాన్ని చూస్తూ కూర్చోక ప్రస్తుత పోరాటానికి అవసరమయ్యే మార్గాల్నతడు కనిపెట్టి తీరతాడు.

విశ్వం పట్లా, జీవితం పట్లా మన దృక్కోణం బలహీనపడింది. విద్యలో మానవీయ శాస్త్రాలకి, సహజ జ్ఞానానికి నడుమ ఖాళీ ఏర్పడింది. విజ్ఞానం ఐక్యతనంగీకరించకపోతే మన ఆలోచనా విధానం అందులో ఒక భాగంగా మిగిలిపోతుంది. ఫలితంగా, ఒక శాస్త్రవేత్త తన ప్రయోగాలకి సంబంధించి మాత్రమే హేతుబద్ధమయిన దృక్పధాన్ని అవలంభిస్తున్నాడే కాని, జీవితంలోని ఇతర రంగాలన్నింటా విశ్వాసాన్ని, సాంప్రదాయాన్నే ప్రముఖంగా పాటించడం జరుగుతోంది. నైతికాదర్శాలతో కూడిన ఒక సజీవ సామాజిక వైజ్ఞానిక వ్యవస్థను మనం రూపొందించుకోగలగాలి. సామాజిక సమస్యల్ని గుర్తించి పరిష్కరించే సాధనాల్ని కనుగొన్నప్పుడే, విజ్ఞానశాస్త్ర ఫలాలు కొద్దిమందికే కాక అందరికీ అందుతాయి. వ్యవస్థ అభ్యున్నతి కొరకే శాస్త్రవిజ్ఞానమనే స్పృహ కలుగుతేనే ఇది సాధ్యమౌతుంది. అదే సమయంలో, సమాజంలో మారుతున్న నవీన ధోరణుల పట్ల సామాన్యులకి అవగాహన కల్పించాలి. సంకుచిత స్వార్థాన్ని విడిచి సహకారపూరిత సంబంధాన్ని నెరపడం ద్వారానే వ్యక్తి జీవితం వ్యవస్థ గతిలో భాగమౌతుందనే స్పృహ రావాలి. సామాజిక శ్రేయస్సులోనే వ్యక్తి సంక్షేమం ఇమిడి ఉందనే విషయం ప్రజలు గ్రహించగలగాలి. అప్పుడే కొత్త సమాజ సృష్టి జరుగుతుంది.

వ్యక్తికి నైతిక, మానసిక, కళాత్మక భావాల్ని వెల్లడించే స్వతంత్రమే సంపూర్ణ జీవితానికి సోపానం. సామాన్య ప్రజలు అభద్రతాభావంలోంచి బయటపడి బీదరికం నుండి విముక్తై ఆరోగ్యకరమైన వాతావరణాన్ని ఆస్వాదించగలిగినప్పుడే అలాంటి జీవితం సాధ్యం. భయం నుంచి విముక్తయిన వాతావరణంలోనే నాగరిక స్వేచ్ఛా సమాజం ఆవిర్భవించగలదు. దోపిడీ, బానిసత్వం నుంచి విమోచన పొందిన ఆ సమాజాన్ని భవిష్యత్తులో చూడగల దార్శనికులంతా వారి శక్తియుక్తులన్నిట్నీ దాని ఆగమనానికి వెచ్చించడానికి వెనుకాడరు. మానవాళి మొత్తం ఇప్పుడు దృష్టి



పెట్టాల్సింది అతి ముఖ్యమైన ఈ అంకాన్నెలా దాటాలనే. దీన్నర్థం చేసుకున్న వ్యక్తులు ఒక్క ఉదుటున కార్యరంగంలోకి దూకి సాధ్యపడినంత విశాల దృష్టితో సహకార సంబంధాల్తో పనిచేసుకుంటూ పోతారు. అన్ని రకాలయిన జాతి, మత, ప్రాంత సంకుచిత వాదాలు నిర్మూలించబడి మానవత్వమే వారికి మహోన్నతమౌతుంది. ఈ దశలో మనందరం కూడా ఒక విషయం తేల్చుకోవాలి. ఎంతో ఉన్నతమయిన ఆవిష్కరణల కోసం ఎదురుచూస్తున్న సమాజంలోని వ్యక్తులుగా మనం మన పరిమితుల్ని గుర్తించి సర్వమానవాళి బాగుకోసం జరుగుతున్న మహా ప్రయత్నంలో మనవంతు పాత్రను నిబద్ధతతో నిర్వహిస్తామా లేక సంకుచిత ప్రయోజనాల పక్షాన నిల్చి వంచితులుగా మిగిలిపోదామా తేల్చుకోవాలి. నా దృష్టిలో జీవితానికి నిజమైన అర్థం సార్వజనీన సంక్షేమం కోసం సామాజిక పునర్నిర్మాణంతో భాగమయిన హేతుబద్ధ ఉద్యమంలో క్రియాశీలక పాత్రను పోషించడంతోనే వెల్లడౌతుంది.

**– ఆచార్య నరేంద్ర దేవ్**

29–10–1949న ఢిల్లీ రేడియో నుంచి ప్రసారమైంది.

ఎ సెలక్షన్ ఆఫ్ హిస్ రయిటింగ్స్

ఆచార్య నరేంద్ర దేవా సమాజ్ వాది సంస్థాన్

వారణాసి, ఢిల్లీ – 1989, పేజీ : 35–39



# సోషలిస్టులకి ఏం కావాలి?

మాకు స్వేచ్ఛ, శాంతి, ప్రగతి కావాలి. ఆలోచనాపరుడైన ఏ వ్యక్తయినా వీటినే ఆశిస్తాడు. స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకోగలిగిన విస్తృత ప్రజలే సృజనాత్మక వ్యవస్థను ఏర్పర్చుకోగలరు. అందుకే మనకి స్వేచ్ఛ అవసరం. మానవాళి సంక్షేమానికి యుద్ధమనేదొ శాశ్వతమయిన అడ్డుగోడగా తయారైంది. ప్రపంచంలోని దేశాలన్నీ పెద్దమొత్తంలో వాటి వనరుల్ని భయంకరమయిన ఆయుధ సంపత్తి కోసమే వినియోగిస్తున్నాయి. కాబట్టి, మనకి శాంతి అవసరం. ఇక ప్రపంచంలోనున్న కోటానుకోట్లమంది అభివృద్ధికి ఆర్థిక, సాంస్కృతిక వికాసం తప్పనిసరి. మాకదే ప్రగతి కావాలి.

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే ఆదర్శవంతమయిన నినాదం ఇప్పటికీ అర్థవంతమయిందే. సూటిగా చెప్పాలంటే సౌభ్రాతత్వం శాంతికి, సమానత్వం ప్రగతికి దారితీస్తాయి. అలా చూస్తే, ఫ్రెంచ్ విప్లవకారుల ఉద్దేశాలతో మౌళికంగా మనకి విభేధాలేవీ లేనట్టే. ఐతే, సోషలిజం పై లోతుగా ప్రభావం చూపే స్వేచ్ఛ, శాంతి, ప్రగతి గుర్చిన భావనతో విభేదముంది.

నిజమయిన స్వేచ్ఛ సంపూర్ణమైనదై ఉండాలి. సోషలిజం స్వేచ్ఛని ఏకమొత్తంగానే చూస్తున్నప్పుడు పాక్షిక కోణాల్లోనే మనకది కనిపిస్తుంది. భూస్వామ్య ఫ్యూడల్ భావాల బందీఖానాలోనున్న స్వేచ్ఛ, వ్యక్తిస్వేచ్ఛగా, ఉద్యమస్వేచ్ఛగా, సంపాదనా స్వేచ్ఛగా మొత్తంగా పౌరస్వేచ్ఛగా పాక్షిక కోణంలోనే చూడబడింది. ఈ మధ్య, రాజకీయ దృష్టితో, అంటే వయోజనులకి ఓటు హక్కును కల్పించడమే ప్రభుత్వం స్వేచ్ఛ పరమావధని పొంగిపోతోంది. కానీ ఆచరణలో, పౌర, రాజకీయ స్వేచ్ఛలేవీ మానవతను విముక్తి చేయలేవు. పౌరహక్కులు, వయోజనుల వ్యవహారాల్నలా ఉంచితే, రాజ్యం మొత్తం కొద్దిమంది పారిశ్రామికవేత్తలు, బ్యాంకు యజమానుల చేత నడపబడుతోంది. ప్రజల మనసులు రాజకీయ యంత్రాంగాలచేత, వార్తాపత్రికల యాజమాన్యాలచేత నియంత్రించబడుతున్నాయి. ఈ అవరోధాల్ని తప్పించుకుని అవకాశాలు పొందడం కొందరికే సాధ్యపడుతోంది. స్వాతంత్ర్యానికి సంబంధించిన అంశాలన్నింటినీ సోషలిజం స్పష్టీకరించింది. సమాజంలో నెలకొని ఉన్న వివిధ పరిస్థితుల్ని అధ్యయనం చేసి విశ్లేషించుకుని, ఆర్థిక, సామాజిక వనరులపై



కొద్దిమంది ఆధిపత్యం మానవాళి మొత్తానికి స్వేచ్ఛని ప్రసాదించలేదనే సోషలిజం అర్థం చేసుకుంది. సమాజంలో డబ్బు ప్రభావాన్ని తొలగించినంత మాత్రాన సంపూర్ణ స్వతంత్రం సాధ్యపడుతుందా? సోషలిస్టు దేశ ఆర్థిక వ్యవస్థపై తిష్ట వేసుక్కూర్చున్న కొద్దిమంది వ్యక్తిగత యాజమాన్యాన్ని ధ్వంసం చేస్తేనే స్వాతంత్ర్యం వస్తుందంటారు. అప్పుడిక దేశంలోని ప్రజలంతా రాజకీయంగా, సాంస్కృతికంగా విముక్తవుతారు.

అలాగే శాంతి నెలకొనాలనే కోరిక యుద్ధాలకి కారణాల్ని అన్వేషిస్తుంది. ఆధిపత్య ధోరణులు, జాతిసమస్యలు, సహజాత కోరికలు ఉపరితలంలో కారణాలుగా కనిపిస్తాయి. కానీ నేటి సమాజంలో మొత్తం ప్రపంచాన్ని చుట్టచుట్టి సామ్రాజ్యవాదుల చేతికివ్వాలనే తపన, వలసవాదం, ప్రజలపై అణిచివేతలే యుద్ధాలకి అసలు కారణం. ఆర్థిక అసమానతలు ప్రశాంతతకి గొడ్డలిపెట్టు వంటివి. అత్యధిక శాతం ప్రజల శాంతికాముకతే పెట్టుబడిదారీ ఆయుధ వ్యాపారుల ఆశలకి కళ్ళెం వేయగలదు.

విస్తృత ప్రజాశ్రేణుల ప్రగతే మా ఆకాంక్ష. మనిషికీ – ప్రకృతికీ నడుమ సహకారపూరితంగా విజ్ఞానశాస్త్రం ఎన్నో అన్వేషణలకి – ఆవిష్కరణలకి వేదికవుతోంది. గడిచిన రెండు దశాబ్దాలుగా పాతకొత్త సరుకులు మొదలుకుని ప్రపంచంలో వస్తూత్పత్తి విపరీతంగా పెరిగింది. అల్ప సంఖ్యాకులయిన కొద్దిమంది బడాబాబుల చేతిలో మొత్తం సొమ్ము ఉంచడమనే ధోరణి ఈ ఉత్పత్తి విస్తృత ప్రజలకి చేరకుండా అడ్డుపడుతోంది. పంపిణీలో జరిగే అన్యాయం మూలంగా విజ్ఞానశాస్త్ర ఫలాలు, ఉత్పత్తి సాధనాలు వృధా ఐపోతున్నాయి. విస్తృత ప్రజానీకాన్ని ససంస్కారంతో కూడిన ఆధునికులుగా మార్చి, నాగరిక జీవన విధానాన్ని వారి దరికి చేర్చే పనింకా మిగిలే ఉంది. వ్యక్తి వికాసాన్ని విస్తృత జనాల అభివృద్ధిగా చూసే మనమే ఈ పని చేయగలం. పోగుపడుతున్న ఆయుధసంపత్తి గణాంకాలు కనుక గమనిస్తే అప్రయత్నంగానే మన శరీరం చల్లబడిపోతుంది.

స్వేచ్ఛా, శాంతి, ప్రగతి మనకి అతి ప్రధానమయినవి. లాభాపేక్ష కోసమే నడిచే ప్రస్తుత ఆర్థిక విధానాన్ని తోసిరాజని సామాజిక యాజమాన్యం కిందికి వనరులన్నింటినీ తీసుకుని వచ్చేంతవరకూ పై ఆకాంక్షలు సాధ్యం కావనే విషయం మాకు తెలుసు.

కానీ, ఈరోజు మన దేశంలో నెలకొని ఉన్న క్లిష్ట సంగతుల మాటేమిటి? లాభాపేక్షతో కోరలు చాచిన సామ్రాజ్యవాద భూతం నోట్లోకి మనం పోతున్నాం. అది రోజురోజుకి మనల్ని పూర్తిగా స్వాహా చేసేస్తోంది.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యం కోసం పోరాడటానికి విస్తృత ప్రజానీకం ఈరోజు సిద్ధంగా ఉంది. స్వేచ్ఛ, ప్రగతి అనే భావనలు విముక్తనే కోణంలో మన మెదడుని ఆక్రమించుకుని పరపాలనపై ధ్వజమెత్తడానికి ఆయత్త పరిచాయి, సామూహిక జీవితంలో సమున్నత లక్ష్యాన్ని ఏర్పరిచాయి. ఈ విషయంలో కలిసొచ్చే జాతీయ కాంగ్రెస్ వంటి సంఘాలతో ఉంటూ, దేశ స్వాతంత్ర్యమనే వాదానికి మా వందనాలు తెలుపుతున్నాం.

సోషలిజం ప్రభావంతో మాలో రగిలిన ఆకాంక్షలన్నీ తప్పనిసరిగా స్వాతంత్ర్యోద్యమంలో సాయపడతాయని భావిస్తున్నాం. కాలక్రమంలో ఎదురయ్యే వివిధ శక్తుల పట్లా, చరిత్రగతిపైనా మాకు అవగాహన వుంది. సామ్రాజ్యవాదానికి జాతీయంగా, అంతర్జాతీయంగా కల బలాల్నీ, బలహీనతల్ని మేం తెల్సుకున్నాం. ప్రపంచాన్ని ఆటబొమ్మలా చేసి ఎప్పుడాడించగలదో, ఎప్పుడు కీలుబొమ్మలా మారి ప్రవర్తించగలదో తెల్సుకున్నాం. దాన్ని సమర్థించే మన మిత్రులు కూడా ఉన్నారు. వారినెలా మార్చగలం? నిరంతర చెడుగులతో బలహీనపడుతున్న సామ్రాజ్యవాద పునాదుల్ని ఎలా కదిలించగలం? సోషలిజం ఈ ప్రశ్నలకు జవాబిచ్చి ప్రజల్నెలా సమర్థవంతంగా కూడగట్టగలమో మార్గం చూపగలదు.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా చేసే ఈ పోరాటంలో కూడా భూస్వామ్య, పెట్టుబడిదారీ ఆధిపత్య శక్తుల్నే మొదట మనం ఎదుర్కోవాల్సి రావచ్చు.

అసలు సామ్రాజ్యవాదమంటే మనకో స్పష్టమైన అవగాహన ఉంటే, మనమీ పోరాటం నుండి పారిపోవడమో, జాతి సమైక్యత పేరిట ముసుగులో దోబూచులాడటమో జరగదు. భారతదేశంలోని రాష్ట్రాలన్నింటిలో ఈరోజు బడా భూస్వామ్య పెత్తందారీతనం, విదేశీ వస్తు వాణిజ్య వ్యామోహం, బ్యాంకులు, ఫ్యాక్టరీల రూపంలోనే సామ్రాజ్యవాదముంది. దాన్ని అర్థం చేసుకుంటేనే, దాంతో యుద్ధమనేది సాధ్యపడుతుంది. ఈ క్రమంలో దేశ స్వాతంత్ర్యం కోసం మనం వేసే ప్రతి అడుగూ



ఎంతోకొంత సామాజిక స్వేచ్ఛకి సాయపడుతుంది. సామ్రాజ్యవాదాన్ని తుదముట్టించిన తర్వాత పెట్టుబడిదారీ, సోషలిస్టు రెండూ కానటువంటి ఆర్థికవ్యవస్థవైపు వెళ్ళేట్టు కనిపిస్తోంది. మన ఆశయాన్ని, ఆకాంక్షల్ని సంపూర్ణంగా నిజం చేసుకునేందుకుగానూ స్వేచ్ఛ, శాంతి, ప్రగతి దిశగా మనం అడుగులేద్దాం.

**- రామ్ మనోహర్ లోహియా**

ఇండియన్ రివ్యూ, జనవరి 1938

లోహియా కలెక్టడ్ వర్క్స్, వాల్యూం - 8, పేజి - 341, 344,

ఎడిటెడ్ బై - మాస్టమ్ కపూర్, అనామిక పబ్లిషర్స్

డిస్ట్రిబ్యూటర్స్, ఢిల్లీ - 2011

